## టెండరు నోటీసు

రేపల్లె తాలూకా పేటేరు గ్రామములోని శ్రీ చెన్న కేశవ స్వామివారి దేవస్థానమునకు తూర్పున 2 కోట్ల కళ్యాణమండపము కట్టుటకు రు 6,673/-లు మంజూరు అయినది. గనుక కావలసినవారు యీనెల 24-వ తేదీలోగా టెండర్లు దాఖలుచేసుకోవలెను. వివరములు ట్రస్టీవల్ల తెలుసుకోవలెను. టెండరుదారు తగు స్థిరాస్తి హామీ యివ్వవలెను.

(సం) బొల్లిశెట్టి నాగభూషణం.
11-9-51. ట్రస్టీ, పేటేరు.

## నోటీసు

**విజయనగరం డి॥ ము॥ కోర్టులో**

విశాఖపట్టణం సబుకోర్టు ఫయిలు O S. 100/49 విజయనగరం మున్సబు కోర్టు ఫయిలు E. P. 104/51.

వాది (Decree holder): ఆంధ్రా బ్యాంకు లిమిటెడ్.

ప్రతివాది (J. D.) : బత్తుల వజ్రం.

పై నెంబరులో ప్రతివాదిపైని డిక్రీ హోల్డరు తనఖా డిక్రీ పొంది రు. 86,801-7-4 దర్శిలా వడ్డీ కోర్టు ఖర్చులు రాబట్టే నిమిత్తం యీ దిగువ వివరించిన తప్సీలు గల ఆస్తులు వేలంకోరి అమలు దాఖలుచేసినందున సదరు ప్రతులు ఆయా ప్రతులకు ఎదురుగా చూపబడిన విలువలు కోర్టువారిచే నిర్ణయింపబడి తే 22-10-51 దీని విజయనగరం మున్సబుకోర్టులో పగలు 11 గంటలు లగాయతూ బహిరంగంగా వేలంవేయుటవు వుత్తరువు కాబడినందున వలయువారు పాడుకొనవచ్చునని యిందుమూలముగా తెలియచేయడమయినది.

**1 వ ప్రతి**

విజయనగరం కొత్త అగ్రహారం రుద్రాభట్లవారి వీధి, వుత్తర శ్రేణిని వున్నటువంటిన్నీ విజయనగరం సంతపేట వార్డు వార్డులో మ్యునిసిపల్ డోరు నెం 1020 రు కలిగినటువంటిన్నీ వు॥ ద॥ సుమారు 78½ అడుగులు తూ॥ ప॥ 51 అడుగులు కొలత కలిగినటువంటిన్నీ మేడ సహితముగల ఇల్లు వివేశనం.-Upset price Rs. 35,000

**2 వ ప్రతి**

విజయనగరం తా॥ సాలిపే సోమరాజుపేట గ్రామం జిరాయితీ పట్టా నెం 1 రు సర్వే నెం 64 రులో చేరినటువంటి వుత్తర దిక్కునువున్న 2. యకరములు విస్తీర్ణంగల మెట్టుభూమి- Upset price Rs. 2,000.

**3 వ ప్రతి**

డిటో గ్రామం డిటో పట్టా డిటో సర్వే నెంబరులో చేరినటువంటి సుమారు య 1-50 సెంట్లు విస్తీర్ణం కలిగినటువంటి మెట్టుభూమిన్నీ అందుపైని కట్టబడి శ్రీ పరమేశ్వర Ground nut oil mill అనే పేరుగలిగిన మిల్లు, మిషనరీ వగైరా యావత్తు పరికరములతో టిన్నీ - Upset price Rs 45,000/-

**4 వ ప్రతి**

డిటో గ్రామం డిటో పట్టా డిటో సర్వే నెంబరులో చేరిన సుమారు 2.00 యకరములు విస్తీర్ణంగల మెట్టుభూమి- Upset price Rs 4,000

**5 వ ప్రతి**

డిటో గ్రామం డిటో పట్టా డిటో సర్వే నెంబరులో చేరిన సుమారు 60 సెం॥ విస్తీర్ణంగల మెట్టుభూమి- Upset price Rs 1,000

యింకా హెచ్చు వివరములు కావలసినవారు డిక్రీహోల్డరు ఏజెంటు గారివల్ల తెలుసుకొనవచ్చును..

విజయనగరం
తే 12-9-51

V. Vankata Rao,
Advocate for
Decree holder.



## గంటల పంచాంగం

ఖర సం॥ భాద్రపద శు॥ పూర్ణిమ
1951 సం॥ సెప్టెంబరు 15 శనివారం
తి॥ పూర్ణిమ సా 6-9 పూ॥భా॥ రా 2-12
వర్జ్యం ప 9-20 ల 10-52 కు.
బ॥ ప్రథమ సెప్టెంబరు 16 ఆదివారం
తి॥ ప్రథమ సా 4-3 ఉ॥భా॥ రా 1-38
వర్జ్యం.ప 11-35 ల 1-8 కు.


# ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర,
యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము
పరమధర్మపథములకు నెల్లన్. (మహాభారతము)

ఖర సం॥ భాద్రపద శు॥ పూర్ణిమ
శనివారం


## బ్రిటన్ - పర్షియా తగాయిదా

పర్షియా నూనె సమస్య రాజీమార్గాన, సంప్రతింపుల ద్వారా పరిష్కారం కాగల అవకాశాలు క్రమంగా తగ్గిపోతున్నవి. ఈ వ్యవహారం ఇక తేలదనే ధోరణిలోనే బ్రిటన్, పర్షియా ప్రభుత్వాలు ప్రవర్తిస్తున్నవి. బ్రిటన్ పర్షియాకు డాలరు సప్లయిలను నిలిపి వేసింది. ఇది ఇరాన్ ప్రభుత్వంపై జరిగిన ప్రతీకార చర్యకాదనీ, డాలరు ప్రాంతాలనుంచి ఇకమీదట నూనె తెప్పించుకోవలసి వస్తుంది గనుక బ్రిటన్ సాధ్యమైనంత వరకు డాలరులను పొదుపుగా వాడుకోవలసి ఉన్నందున ఇట్టి చర్య తీసుకోవడం జరిగిందనీ ప్రకటింపబడింది.

బ్రిటన్ ఈ విధంగా వ్యవహారం చేయడం ప్రారంభించినప్పటికీ పర్షియామాత్రం తిరిగి రాజీ సంప్రతింపులు ప్రారంభించడానికి సిద్ధంగానే ఉంది. 15 రోజులలో పున బ్రిటిష్ ప్రభుత్వం తిరిగి రాయబారాలు ప్రారంభించని పక్షంలో పర్షియా నూనె పరిశ్రమలో ఉన్న బ్రిటిష్ వారినందర్నీ దేశం నుండి బహిష్కరించి వేయవలసి వస్తుందని ప్రధాన మంత్రి ముస్సాదిక్ హెచ్చరించాడు. ఈ శ్రీముఖం బ్రిటిష్ ప్రభుత్వ వైఖరిలో ఎలాంటి మార్పునూ తీసుకురాలేదు. పైగా పర్షియాకు కీలక పదార్థాల సప్లయిని పూర్తిగా నిలిపివేసింది. పర్షియాకు సరుకును తీసుకుపోతున్న నౌకలను కూడా ఇతర ప్రాంతాలకు మళ్ళించింది. ఇక పర్షియా ప్రభుత్వం అబడాన్‌లోని 'కమ్యూనికేషన్సు' ఇంజనీరును తొలగించి ఆ స్థానంలో ఒక పర్షియను ఇంజనీరును నియమించింది. బ్రిటిష్ అధికారులు ఇందుకు అసమ్మతి సూచకంగా ఇప్పుడు 'కమ్యూనికేషన్సు' ప్రవీణులను ఉపసంహరించుకున్నారు.

ఈ విధంగా బ్రిటిష్-పర్షియన్ అధికార వర్గాలమధ్య విషమపరిస్థితులు ఏర్పడి సంఘర్షణకు దారి తీస్తున్నవి. అమెరికా అధ్యక్షుని ప్రత్యేక రాయబారి అవిరెల్ హారిమన్ లోగడ విరమింపబడిన సంప్రతింపులను పునరారంభం కావడంలో మాత్రం ఫలితాన్ని సాధించాడుగాని, ఆ రాయబారాలు ఫలప్రదం అయ్యేటట్లు చేయలేకపోయినాడు. ఆ స్వల్లో రాయబారాలను కొనసాగించ నిరాకరించింది పర్షియా. గనుక అమెరికా ఆర్థికసహాయం అనవసరమని ముస్సాదిక్ ప్రభుత్వాన్ని తిరిగి రాయబారాలు జరపేందుకు ఒప్పించకలిగాడు. ఇప్పుడు బ్రిటిష్ ప్రభుత్వమే సంప్రతింపులను విరమించింది. బ్రిటన్ స్టోక్సు ప్రతిపాదనలను నుంచి పర్షియా కోరికలను తీర్చడానికి చేయకల్గిందేమీ లేదని హారిమన్ ప్రకటించాడు. తిరిగి ఈసారికూడా పర్షియా ప్రభుత్వాన్ని లొంగదీయవలసి వచ్చింది. ఇది సాధ్యంగాదనే అనుమానం హారిమన్‌కూ ఉంది.

ఆర్థిక ఒత్తిడిద్వారా మాత్రమే పర్షియాను లొంగదీయాలని బ్రిటన్, అమెరికాలు నిశ్చయించుకొన్నవి. బ్రిటిష్ విదేశాంగమంత్రి, ఖజానామంత్రి కూడా ప్రస్తుతం అమెరికాలో ఉన్నారు. వీరిరువురూ పర్షియా ప్రభుత్వాన్ని స్టోక్సు ప్రతిపాదనలకు సుముఖంగా చేయడానికి ఏ చర్యలు తీసుకోవాలో అమెరికా అధికారులతో సంప్రతింపులు జరపగలరు. గ్రేడీ స్థానే లాయ్ హెండర్సన్ పర్షియాకు అమెరికా రాయబారిగా వెళ్ళుతున్నారు. ఇందువల్ల అమెరికా విధానంలో గాక పోయినా వ్యవహార ధోరణిలో కొంత మార్పు రావచ్చు. పర్షియాలోని ప్రస్తుత ప్రభుత్వం మారితేతప్ప ఒడంబడిక కుదరదని బ్రిటిష్ విదేశాంగమంత్రి స్పష్టంగా ప్రకటించాడు. హెండర్సన్ కృషి ఇందుకు సహాయకారిగా వుంటుందా లేక స్టోక్సు ప్రతిపాదనలకు ముస్సాదిక్ మంత్రివర్గాన్ని ఒప్పించడానికి ఇంతవరకు జరిగిన ప్రయత్నాలు ఫలప్రదం కావడానికి సహాయపడుతుందా? పర్షియా చమురు సప్లయిలకు విఘాతం ఏర్పడం పశ్చిమ రాజ్యాలకు క్షేమం కాదు. పర్షియా ప్రభుత్వం ఇప్పటికే చెకస్లవేకియా నూనె నిపుణులతో రాయబారాలు ప్రారంభించినట్లు అధికారరీత్యాకూడా వెల్లడింపబడింది. ఈ రాయబారాలు ఫలప్రదమైతే సోవియట్ ఉపగ్రహ దేశాలకు పర్షియాలో ప్రవేశం లభిస్తే పర్షియా నూనె పశ్చిమరాజ్యాలకు లభించకుండా పోవడమేగాక మధ్యప్రాచ్య రాజకీయాలన్నీ పూర్తిగా మారిపోగలవు. పాలస్తీనాలో రష్యాకు స్థావరం లభించకుండా లోగడ బ్రిటన్ అమెరికాలు చేయకల్గినవి. అందువల్ల కల్గిన ప్రయోజనాలన్నీ ఇందువల్ల వమ్ము కాగలవు.

ఏమైనా ఈ నూనె సమస్యను శాంతియుతంగా పరిష్కరించుకోవడమే పర్షియా, బ్రిటన్‌లకూ, ఇతర ప్రజాస్వామిక రాజ్యాలకూ క్షేమకరం.

## కాశ్మీరుకు 80 లక్షల రూపాయల ఋణం

### కేంద్ర ఆర్థికస్థాయీ సంఘ ఆమోదం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 13: కాశ్మీరు ప్రభుత్వానికి 80 లక్షల రూపాయల ఋణం ఇవ్వడానికి భారత ప్రభుత్వ ఆర్థిక స్థాయీ సంఘం ఆమోదించినది.

ఆ మొత్తంలో 50 లక్షల రూపాయలు కాశ్మీరు ప్రారంభించిన అభివృద్ధి ప్రణాళికల కార్యాచరణకు వినియోగింపబడుతుంది. తతిమ్మా మొత్తం ఈ ఏడాది కాశ్మీర్ బడ్జెట్‌లో తరుగు భర్తీ చేయడానికిగాను ఉపయోగపడుతుంది.

కాశ్మీరు సంస్థానంలో అనాథులుగా ఉన్న స్త్రీలకు, పిల్లలకు పునరావాసం కల్పించడానికై మరి 3,17,000 రూపాయలు గ్రాంటు చేయడానికి కూడా స్థాయీసంఘం ఆమోదించినది. భారతదేశ ఈశాన్య సరిహద్దు ప్రాంతాలలో నివారికి విమానాల నుండి సరఫరాలు పడవేయడానికి 1,30,000 రూపాయలు బ్యాంకి పనివారల తగాదాలు పరిష్కరించడానికి కొత్తగా స్థాపించిన పారిశ్రామిక న్యాయస్థానానికి 89,000 రూపాయలు, కూచ్‌బీహారులో సెంట్రల్ ఎక్సైజ్ సర్కిల్ కార్యాలయం స్థాపించడానికి 4,03,196 రూపాయలు కూడా గ్రాంటు చేయడమైనది.

# 'దేశక్షేమాన్ని గమనించి కాంగ్రెస్‌లో తిర్గి చేరండి'

## కాంగ్రెస్‌ను వదలినవారికి నెహ్రూ హితవు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 14: ఈమధ్య కాంగ్రెస్‌ను వదలిపోయిన వారినందరిని తిరిగి కాంగ్రెస్‌లో చేరవలసిందని, ఆ చేరడంగూడా కాంగ్రెస్ ఆశయాలపట్ల, లక్ష్యాలపట్ల విశ్వాసం వుంటేనే చేరవలసిందని కోరుతూ కాంగ్రెసు అధ్యక్షుడు పండిత జవహర్‌లాల్ నెహ్రూ నేడొక ప్రకటన చేశారు.

గతాన్నిగురించి ఎవ్వరూ చింతిపడటం తగదని ఆయన ఈ ప్రకటనలో హెచ్చరించారు. "దేశ భవిష్యత్తును మాత్రమే మనం దృష్టిలో వుంచుకోవాలి. అందునిమిత్తం కష్టపడి పనిచెయ్యాలి. ఈ పనిచేసేందుకుగాను చిల్లర అభిప్రాయభేదాలు ఏమున్నా ఇంకా మిగిలివుంటే, వాటిని దూరంచేసుకొని, ముందుపనికి ఉపక్రమించాలి" అని ఆయన కాంగ్రెసువాదుల నందరిని హెచ్చరించారు.

కాంగ్రెసులోంచి వెళ్ళిపోయినవారినేగాక, కాంగ్రెసువాదులు కానివారినిగూడా జాతీయనిర్మాణ కార్యకలాపాలలో కాంగ్రెసుతో కలిసి పనిచేయవలసిందిగా ఆయన ఆహ్వానించారు. కొన్ని కొన్ని విషయాలలో అభిప్రాయాలు ఒకటిగా వుండకపోతే పోయినాయిగాక. అవివినా తక్కిన అన్నిరంగాల్లోను దేశ హితంకోసం అంతాకలిసి పనిచేయవచ్చు" అని కాంగ్రెసు అధ్యక్షుడు ఈ ప్రకటనలో అందరికీ ఒకవిన్నపం చేశారు.

ముందు పనిని నిర్వహించడంలో కాంగ్రెసు వాదులయొక్కయేమి, కానివారియొక్కయేమి, సహకార సంపత్తులను పొందగలనని విశ్వాసం నాలో లేకపోతే, కాంగ్రెసు అధ్యక్షపదవిని నేను గ్రహించినదానితో సార్థకం ఏమివుంటుంది? కాంగ్రెసు వ్యవహారాలను నడిపించే ఆసామాన్య అధ్యక్షుడుగా పనిచేయడం నాకెంత మాత్రం ఇష్టం లేదు. ఆ విధంగా వ్యవహరించడానికి ప్రయత్నిస్తే నాయందు వుంచిన ఈ నమ్మకాన్ని వృధాచేసినవాణ్ణి అయిపోతాను అని నెహ్రూ అన్నారు.

కాంగ్రెసు వాదులకు ఈ ప్రకటనలో నెహ్రూ ఒక ముఖ్యమైన హెచ్చరిక చేశారు. కాంగ్రెసులో ముఠాలు కట్టబోకండి. అందువల్ల మనం బలహీనులమయి పోతాం. హీనులమయి పోతాం. ఏ పుజ్వల విక్రమంతో పని చేశామో, దానిని ఇప్పుడు తిరిగి మనసా పట్టుకోవడం అవసరం. మన వుత్సాహాన్ని అంతా పక్షిలో చూపెట్టి కార్యకూరులం అనిపించుకోవాలి. ఇతరులలోపాలను ఎత్తిచూపడం మానుకోవాలి. అని ఆయన స్పష్టం చేశారు.

ఐదురోజుల క్రిందట విధి బలీయం అయి, పరిస్థితులు ఒనగూడి, అఖిల భారత కాంగ్రెసు సంఘం నన్ను కాంగ్రెసు అధ్యక్షుణ్ణి చేసింది. ఇప్పటికే నాతలమీద ఎంతో బరువువుంది. దానికితోడు ఈ కొత్త బరువు కూడా నెత్తిమీద వేసుకోవలసి వచ్చింది. దీన్ని తప్పించుకోవడంసాధ్యం కానిపని. ఎందుచేతనంటే, ఈ కొత్త బాధ్యతలు నానెత్తిమీద పడే పరిస్థితిని నేనే స్వయంగా కల్పించాను. ఇప్పుడు అది నానెత్తిన పడిందని తప్పించుకో చూడడం తగనిపని. నేను నిర్వహించిన కర్మయొక్క ఫలితాన్ని వహించక తప్పదు. వినమ్ర భావంతో నేనీ కొత్త భారాన్ని గ్రహించాను. ఏ. ఐ. సి. సి. ఏ ఉదాత్తభావ ప్రేరణలో ఈ భారాన్ని నామీద వుంచిందో అంతటి ఉదాత్త చిత్తంతోను దానిని వహిస్తున్నాను. మనం ముందు నిర్వహించవలసిన పని ఎంతో వుంది. ఆ పనిని నిర్వహించడం నిమిత్తంగా ఎంతటి సహకారభావమో ప్రబుద్ధం కాంగ్రెస్‌లో కన్పిస్తున్నది. అందులో ప్రాతవారు ఎంతోమంది వున్నారు. కొత్తవారు ఇంకా చాలామంది వున్నారు. వారిలో నాకు నమ్మకమే లేకపోతే, నేను ఈ బాధ్యతలను వహించి వుండేవాడినే కాదు.

కాంగ్రెస్ వాదులు, ఇతరులు దేశంకోసం నిర్వహించవలసివున్న కార్యకలాపాలలో నాకు చేదోడు, వాదోడుగా వుండగలరన్న విశ్వాసమే నాలో లేకపోతే, నేను కాంగ్రెస్ అధ్యక్షస్థానాన్ని గ్రహించడంలో అర్థమే లేదు. ఏదో ఆసామాన్య అధ్యక్షుడుగా పని చేయడం నాపనికాదు. అట్లా చేస్తే నాయందు ఇంతగా ఇందరు వుంచిన విశ్వాసాన్ని వమ్ముచేసినవాణ్ణి అవుతున్నాను.

అందువల్ల నా నూతన కార్యభారాన్ని గూర్చి ఎంతో ఇదిగా ఆలోచించాను. జరిగిన ఐదురోజుల్లో ను పాత స్నేహితులను ఎంతోమందినో కలుసుకొని, వారితో కాంగ్రెస్ స్థితిగతులను, దేశం స్థితిగతులను గూర్చి చర్చించాను. ఇట్టి చర్చలు, సమాలోచనలు ఇకముందు గూడా జరుపుతూవుండవలసిన అవసరాన్ని గూడా గుర్తించివున్నాను. ఎందుచేతనంటే ఒకరిని ఒకరు అర్థంచేసుకోడానికి, మన కృషి సఫలీకృతం కావడానికి ఇట్టి సమాలోచనలు అవసరం. అట్లాగే నేనుగూడా కాంగ్రెస్ బలపరచడాన్ని గూర్చి, కాంగ్రెస్ కార్యక్రమాన్ని నిర్వహించడాన్ని గూర్చి అప్పుడప్పుడు నా అభిప్రాయాలను గూడా వారికి అందజేస్తా వుంటాను.

ఇంతకాలంగా కాంగ్రెస్ మనకు బలం చేకూర్చేదిగా వుంటూ వచ్చింది. దాన్ని చూచి మనం గర్వాన్నికూడా పొందుతూ వుండేవాళ్లం. పరిస్థితులుమారి అందుకు కొంచెం అవాంతరం ఏర్పడింది. అది కొత్త సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చింది. పూర్వపు పరువం దానిలోంచి కొంచెం తొలగిపోయింది. కారణం, కార్యకారిత్వం దానిలో కొంతగా లోపించింది. స్వాతంత్ర్య పోరాటంలో సాధించిన విజయంయొక్క ఫలితంగా ఇది కన్పిస్తున్నది. ఆతర్వాత కాంగ్రెస్‌లో ఎన్నో లోపాలు తలలెత్తాయి. ముఠాతత్వం బలిసిపోయింది. మన శక్తిసామర్థ్యాలు అనుచిత పథాల్లో పడిపోయినాయి.

దీనినంతా మనం బాగుచెయ్యాలి. ఎందుచేతనంటే, దేశంలో ప్రజలు హీనస్థితిలో వున్నంతవరకు స్వాతంత్ర్యం అన్న దీనికి సమగ్రత చిక్కదు. రాజకీయ స్వాతంత్ర్యం మనకు వచ్చింది. మనం స్వతంత్రులం అయినాము. కాని తక్కిన స్వాతంత్ర్యాలు మిగిలే వున్నాయి. వాటిని సాధించడానికి పోరాటం సాగించవలసి వుంది. ఈపోరాటం సాగించడానికి కాంగ్రెస్ కన్నా ఉచితమైన వ్యవస్థ ఇంకొకటి ఏదీలేదు. అది దేశానికి స్వాతంత్ర్యాన్ని సమకూర్చింది.

ఇది చాలా పెద్దపని. దీనిని నిర్వహించడానికి మనం ఎంతో పెద్ద ఎత్తున పనిచేయాలి. అప్పుడే మనం చరితార్థులం అనిపించుకోగల్గుతాం. మనలో ముఠాతత్వం వదిలితేనే గాని, లాభంలేదు. అది మనల్ని బలహీనపరుస్తుంది. న్యూనపరుస్తుంది. పూర్వం మనలో విక్రమోత్సాహం వెల్లివిరిసి వుండేది. ఇప్పుడు తిరిగి దాన్ని పట్టుకోగల్గాలి. మనలో యెంత ఉత్సాహం వుందో దానిని మనం చేసే పనుల ద్వారా వ్యక్తం చేసుకోవాలి. ఇతరులనూర్చి తప్పులను ఎంచే ప్రవృత్తిని చంపుకోవాలి.

ప్రతి ప్రదేశ కాంగ్రెసు సంఘం కూడా ఈ విధంగా తనదృష్టి సంస్కరించుకొని యీ కొత్త ఉత్తేజాన్ని ఆకళింప చేసుకుంటుందని ఆశిస్తున్నాను. ముఖ్యంగా ఈ కాంగ్రెసు సంఘాలు ముఠా తత్వాలను, పక్షపాత బుద్ధిని పరిహరించుకోవాలి. ఆట్టి పద్ధతులపట్ల ఔదార్యం చూపకుండా వుండాలి. కాంగ్రెసు కార్యకర్త, కాంగ్రెసు వ్యవహర్తలు అచ్ఛాశీలురై వుండడం ఎంతో అవసరం. ఋజుప్రవర్తనులై వుండటం అవసరం. అదీకాక ఈ వ్యవహర్తలు వట్టి అచ్ఛాశీలురైవుంటే చాలదు. అట్టి వారని లోకంచేత అనబడుతున్న వారైగూడా వుండాలి. విస్పష్టపాతబుద్ధులు కానివారిని ఋజుప్రవర్తనలేనివారిని కాంగ్రెసు వ్యవస్థలో పెద్ద స్థానాలలో వుంచడం తగదు.

ఈ పైన పేర్కొన్న సుణాలన్నీ ఎన్నికలకు నిలిచే అభ్యర్థులలో ఉండేటట్లు చూడవలసిన అవసరం ఎంతైనా వుంది. ఈ ఎన్నికల్లో నెగ్గాలన్నది మన ఆశయం. అట్లు నెగ్గాముకూడాను. అందువల్ల నేనుదం అభ్యర్థులుగా నిలపబోతున్న వాళ్లు, అచ్ఛశీలురు, శక్తి సంపన్నులు, అయివుండాలి. మోసంచేసి ఎన్నికలలో గెలిచేకన్నా, ఓడిపోవడానికి సిద్ధపడేవాళ్లు అయివుండాలి. మన ఎన్నికల ప్రచారం గూడా అట్లాగే ఋజువుగా వుండాలి. ప్రతిపక్షులపట్ల వైమనస్యం పనికిరాదు. తప్పుడు మార్గాలు త్రొక్కి, తప్పుడు పద్ధతులు అనుసరించి, ఎన్నికల పేరుకు అప్రతిష్ఠ కల్గించడం తగదు.

ఈ సందర్భంలో అల్ప సంఖ్యాకులను మరచిపోవడం తగదు. వారియందు మనం కొన్ని బాధ్యతలు నిర్వహించవలసివుంది. కాంగ్రెస్ కమిటీలు ఈ విషయాన్ని గుర్తువుంచుకు వ్యవహరించాలి. కాంగ్రెస్ ఆదేశాలను ఒప్పుకుంటున్న అల్పసంఖ్యాకుల ప్రతినిధులను అభ్యర్థులుగా నిలబెట్టాలి. ఈ నిలపడంలో ఆయా కులాల వారిలో పెద్దమనుష్యులను సంప్రదించాలి. కొన్నిచోట్ల ఆట్టివారు ముందుకురారు. ఆ రానిచోట్ల కాంగ్రెస్ వారు స్వయంగా వారిని పిలిచి, సంప్రదింపులు సాగించాలి.

కాంగ్రెస్ వాదులు చాలామంది ఈమధ్య కాంగ్రెస్‌ను వదిలిపెట్టిపోయారు. అందుకు అనేక కారణాలు వున్నాయి. బెంగుళూరు ఏ. ఐ. సి. సి. లో తీర్మానాన్ని అనుసరించి వారిని తిరిగి పరిగ్రహించడానికి కాంగ్రెసు ఎప్పుడూ సిద్ధంగానే వుంది. కాంగ్రెసు ఆశయాలలో వారికినమ్మకం వుంటే తిరిగిరావచ్చు; చేరవచ్చు. వాళ్ళకిష్టంచవ లేకుండా

నేను కూడా వారిని తిరిగివచ్చి కాంగ్రెసులో చేరవలసిందిగా ఆహ్వానిస్తున్నాను.

గతాన్ని గురించిన తర్జనలు అనవసరం. ముందు నిర్వహించవలసిన పని ఎంతో వుంది. అల్పమయిన భేదభావాలు వుంటే వాటిని మనం పరిహరించుకోవలసివుంది. మన లక్ష్యాలను సహకారభావంతో సాధించడానికి ఇది అవసరం.

కాంగ్రెసు వాదులు కానివారు గూడా మనకు ఈ మహాకృషిలో చేదోడు వాదోడు కావాలని నా ఆశ. వారిని గూడా వచ్చి మనతో చేతులు కలిపి పనిచేయవలసిందిగా కోరుతున్నాను. కొన్ని విషయాలలో వారికి మనకు ఏకాభిప్రాయం లేకపోవచ్చు. తక్కిన విషయాలలో ఈ కలుపుగోలుతనం చూపవచ్చు, ఏకోద్దేశ్యమాత్రంగా నైనాసరే మనం అంతా కలిసి పనిచేస్తే దేశానికి ఎంతో మేలును చేకూర్చవచ్చునని నా అభిప్రాయం.

# ఎన్నికలలో అభ్యర్థివ్యయానికి గరిష్ఠ ప్రమాణం: ప్రభుత్వ ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 13: వచ్చే ఎన్నికలలో ఒక్కొక్క నియోజక వర్గంలో అందు నిమిత్తంగా ఒక అభ్యర్థి ఎంతఖర్చు పెట్టుకోవచ్చునో దాని గరిష్ఠ ప్రమాణాన్ని నిర్ణయిస్తూ నేడు ప్రభుత్వంవారు ఒక ప్రకటన చేశారు. 1951 ప్రజా ప్రాతినిధ్యం బిల్లును అనుసరించి ఈ ఏవంవిధి నిర్ణయం జరిగింది.

ఈ వ్యయ ప్రమాణాన్ని నిర్ణయించడం ప్రభుత్వం ఆయా నియోజక వర్గాల ఓటర్లసంఖ్యను ప్రాతిపదికగా తీసుకొని, నిర్ణయించింది. అందువల్ల ఈ ఖర్చులు ప్రతి నియోజకవర్గానికి ఒకేవిధంగా వుండక ఓటర్ల సంఖ్యను బట్టి మారుతూవచ్చాయి.

పార్టు 'ఏ' 'బి' రాష్ట్రాలలో ఏకసభ్య నియోజకవర్గంలో అభ్యర్థి ఖర్చుల ప్రమాణం 25 వేల రూపాయలుగా నిర్ణయించబడింది. ద్విసభ్య నియోజకవర్గాలలో 35 వేలుగా నిశ్చయించబడింది. త్రైసభ్య నియోజకవర్గంలో 40 వేలుగా నిర్ణయించబడింది. (ఇట్టి నియోజకవర్గం ఇండియాలో ఒక్కటే వుంది.) ఇవన్నీ పార్లమెంటరీ నియోజకవర్గాలకు సంబంధించిన ఖర్చులు.

రాష్ట్ర శాసనసభల నియోజకవర్గాలలో అభ్యర్థి వ్యయప్రమాణం ఈ విధంగా నిర్ణయించబడింది.

**ఏకసభ్య నియోజక వర్గాలు**

పెప్సూ 4000, సౌరాష్ట్ర 4000, మధ్యభారత్ 5000, మైసూరు 5000, తిరువాన్కూరు కొచ్చిన్ 5000, హైదరాబాద్ 4000, రాజస్థాన్ 4000, అస్సాం 5000, మధ్యప్రదేశ్ 6000, బొంబాయి 7000, ఒరిస్సా 7000, పంజాబు 7000, పశ్చిమ బెంగాలు 7000, బీహారు 8000, మద్రాసు 8000, ఉత్తరప్రదేశ్ 8000, కూర్గు 1000, అజ్మీర్ 2000, భోపాల్ 2000, ఢిల్లీ 2000, హిమాచలప్రదేశ్ 2000, వింధ్యప్రదేశ్ 4000.

**ద్విసభ్య నియోజకవర్గాలలో**

కూర్గు 2000, అజ్మీర్ 4000, భోపాల్ 4000, ఢిల్లీ 4000, హిమాచలప్రదేశ్ 4000, వింధ్యప్రదేశ్ 8000, పెప్సూ 8000, సౌరాష్ట్ర 8000, మధ్యభారత 10000, మైసూరు 10000, తిరువాన్కూర్ - కొచ్చిన్ 10000, హైదరాబాదు 12000, రాజస్థాన్ 12000.

పార్టు 'ఏ' రాష్ట్రాలలో ఒక్క అస్సాంలో ఈ వ్యయం 10000 లుగా నిర్ణయింపబడింది. బొంబాయి మద్రాసు ఆదిగాగల తక్కిన రాష్ట్రాలలో 12 వేలుగా నిర్ణయింపబడింది. బొంబాయి త్రైసభ్య నియోజకవర్గం ఒకటి వుంది. ఆ నియోజకవర్గంలో అభ్యర్థి పెట్టగల వ్యయం 16 వేలుగా నిర్ణయించబడింది.

ఇక ఏగువ సభలు అంటూ వున్న రాష్ట్రాల విషయంలో పట్టభద్రులు, ఉపాధ్యాయుల నియోజకవర్గంలో ఖర్చు 8 వేలుగా నిర్ణయించబడింది. ఇట్టి రాష్ట్రాలు 7 వున్నాయి.

ఎన్నికలు పూర్తిఅయిన ఫలితాలు ప్రకటింపబడిన 45 రోజులలోగా అభ్యర్థులు తమ ఖర్చుల వైనాన్ని రిటర్నింగ్ ఆఫీసర్లకు దఖలుపరచుకోవాలి. అట్లా చేయనివారు అనర్హులుగా ప్రకటింపబడతారు. ఈ ఖర్చుల వైనంలో డబ్బు ఏవిధంగా ఖర్చుపెట్టబడిందీ రసీదులతో సహా తయారుచేయబడాలి. ప్రయాణంఖర్చులు, హోటలుఖర్చులు, ఏజంట్లకు, సుమాస్తాలకు వార్తాహారులకు ఇచ్చిన జీతాలు, అడ్వర్టైజుమెంటు ఖర్చులు, మొదలైన అన్ని ఖర్చులు వేరు వేరు వసూలు చూపాలి.

## ప్రధాని నెహ్రూ

లక్నో, సెప్టెంబరు 13: ప్రధాని మంత్రి నెహ్రూ వచ్చేఆదివారంనాడు లక్నోకు యు. పి. కాంగ్రెస్ సంఘ సమావేశంలో పాల్గొనే నిమిత్తం వస్తారు.

ఆరోజు సాయంత్రం ఒక బహిరంగసభలో కూడా ఆయన ఉపన్యాసం ఇస్తారు.

## కళా వెంకట్రావుగారు మళ్లీ రెవెన్యూమంత్రి

మద్రాసు, సెప్టెంబరు 14: ఆ.భా. కాం. కార్యదర్శిగా ఉంటున్న కళా వెంకట్రావుగారు మళ్లీ మద్రాసు ప్రభుత్వ రెవెన్యూమంత్రిగా వస్తున్నారని అనుకుంటున్నారు.

## మంత్రి పదవికి డా॥ రాజన్ రాజీనామా

మద్రాసు, సెప్టెంబరు 14: అనారోగ్య కారణంగా తాను ఇక మంత్రి పదవిని నిర్వహించలేననీ, తాను రాజీనామా ఇస్తున్నాననీ, వెంటనే అది అమలులోకి వచ్చేట్లు చూడవలసిందనీ మద్రాసు ప్రభుత్వ ఆరోగ్య శాఖామంత్రి డా॥ టి. ఎస్. ఎస్. రాజన్‌గారు మద్రాసు ముఖ్యమంత్రికి తెలియ చేశారు.

కుమారస్వామి రాజాగారు ఎన్నికల పర్యంతమూ ఉండ వలసిందని డా॥ రాజన్ గారిని కలుసుకొని చెప్పారు.

వారు విరమించ కోరినందున ఈ సాయంత్రం వారికి గౌరవార్థం ముఖ్య మంత్రి మంత్రులకు విందుచేస్తున్నారు.

## ప్రాయోపవేశంచేస్తున్న వారికి ప్రమాద స్థితి

(1 వ పేజీ తరువాయి)

ప్రెసిడెంటు ప్రసాదు, ప్రధాని నెహ్రూలను కలుసుకొంటున్న నారి వద్దనుండి యీ విధమైన ప్రోత్సాహకరవార్తలు అందుతూవున్న యీ సమయంలో స్వామీజీ, వారి అనుచరుల ప్రాణాలను గూర్చిన ఆందోళన ప్రజలను కలవరపరుస్తున్నది.

నిన్నటి ప్రార్థనానంతర సభలో గుంటూరు పురపాలక సంఘ సభ్యుడు రత్నసభాపతి గారు తమ సభ్యత్వానికి యిచ్చిన రాజీనామాను స్వామీజీకిఅందచేశారు. మద్రాసు కౌన్సిల్ సభ్యుడు దుర్గా పురుషోత్తంగారు (తూ. గో. జిల్లా) తమ సభ్యత్వానికి యిచ్చిన రాజీనామా కూడా స్వామీజీకి నేడు అందింది. కడప కలెక్టరు కార్యాలయంలో గుమస్తా వి. వి. సుబ్రహ్మణ్యంగారు తమ వుద్యోగానికి యిచ్చిన రాజీనామాను స్వామీజీకి అందచేశారు. ఆంధ్రరాష్ట్ర స్థాపన విషయంలో బ్రిటిష్ ప్రధాని చర్చిల్ పోయిన పోకడలు నెహ్రూగారుకూడా పోతున్నారని, అందుకు నిరసన సూచకంగా తన వుద్యోగానికి రాజీనామా యిస్తున్నాననీ సుబ్రహ్మణ్యంగారు తమ లేఖలో పేర్కొన్నారు.

నిన్న సాయంకాలం ప్రార్థనానంతర సభలో ప్రసంగిస్తూ, మద్రాసు నగరం విషయం మధ్యవర్తిత్వ పరిష్కారానికి నివేదించకుండా ఆంధ్ర రాష్ట్ర విభజనకు ప్రభుత్వం పూనుకొంటే దానిని ఆంధ్రులందరూ ప్రతిఘటించవలసిందిగా కోరారు. ప్రభుత్వం పరంగా అనానుకూలమైన నిర్ణయాలు ప్రకటింపబడేటంత వరకూ ఎవరూ వేచివుండవలసినక్కర లేదనీ, ఎవరికివారు భాగాలలోచించు కొన్నమీదట చేసుకొన్న నిర్ణయాల సాధనకై ఆందోళన కొనసాగించుకోవచ్చుననీ స్వామీజీ నీరసించిన కంఠంతో సమాధానం యిచ్చారు. తమను మాత్రం యెవ్వరూ ప్రాయోపవేశం విరమించమంటూ ఒత్తిడి చేయవద్దని కోరారు.

తమగం సత్యాగ్రహం ఆరంభిస్తే అందుపాల్గొని, ఆ వుద్యమాన్ని బలపరచగలమని హామీలు చేస్తూ స్వామీజీకి ఎందరో వ్రాసిన లేఖలు లెక్కకు మిక్కుటంగా వచ్చిపడుతున్నాయి.

### వెంకటాపుర గ్రామస్థుని ఉపవాస దీక్ష

స్వామి సీతారాంగారి అనుజ్ఞను తీసుకొని కైకలూరు తాలూకా వెంకటాపుర గ్రామస్థుడు పొన్నాడ శ్రీరామచంద్రుడుగారు 15 రోజుల వుపవాసదీక్ష ప్రారంభించారు. విజయవాడలో కృష్ణానదీతీరాన దీర్ఘవుపవాస దీక్ష పూనదలచి బాలప్రసాద్ మండల నేడి సంకటరత్నం, మహమ్మద్ హైదర్ సాహెబ్ గార్లు నిన్న నిక్కడకు వచ్చారు. స్వామీజీ వారిని యిక్కడనే వారం రోజులపాటు వుపవాసం చేయమనీ, తదనంతరం విజయవాడకు పోయి అక్కడ కొనసాగించమని ఆదేశమిచ్చారు. చిరంతా దీక్ష తీసుకొని ప్రాయోపవేశ మారంభించారు. కృష్ణాజిల్లా ఆంధ్ర సంఘం వారు 200 మంది సత్యాగ్రహులను సమర్పించగలమని స్వామీజీకి తెలిపారు. (స్వ. వి.)

### చెన్నపురి ఆంధ్రుల ఉపవాస దీక్ష

ఆంధ్రరాష్ట్ర సిద్ధికై శ్రీ స్వామి సీతారాంగారు కొనసాగిస్తున్న ప్రాయోపవేశముపట్ల తమకుగల భక్తి విశ్వాసాలను ప్రదర్శిస్తూ దీక్షను బలపరచుటకుగాను, 16-వ తేదీ ఆదివారంనాడు మద్రాసు ఆంధ్రవిజ్ఞాన సమితి సభ్యులు ఉపవాస దీక్ష నవలంబించుటకు నిశ్చయించిరి. మద్రాసు ఆంధ్రులంతా ఈ వుపవాస దీక్షలో పాల్గొని శ్రీ స్వామీజీ కృషికి దోహద మీయవలెనని సమితి సభ్యుల కోరిక. ఉపవాస దీక్షలో పాల్గొనగోరువారు 15-వ తేదీ రాత్రి లోపల తమపేరు సమితికార్యాలయానికి అందజేయవలెనని వారుకోరుతున్నారు.

స్వామీజీ వుద్యమంపట్ల తమపూర్తి విశ్వాసాన్ని ప్రకటిస్తూ వి. వి. గిరి గారు తంతిద్వారా తెలియజేశారు.

## రాష్ట్ర నిర్మాణం నెహ్రూ స్పష్టీకరణ

(1-వ పేజీ తరువాయి)

వ్రతం చేస్తే తాను చెప్పిందానికి తక్కిన ఇతరపార్టీలన్నీ అంగీకరించాలని నిర్బంధించినట్లు అవుతుంది; యిది అనేక కొత్తచిక్కులకు దారి తీస్తుంది.

రంగాగారు:-ఆంధ్రులు మద్రాసు నగరంమీద హక్కు వదులుకోవాలన్న నాయకత్రయ నివేదికలోని ముఖ్యాంశంకు ఆంధ్ర కాంగ్రెసు అంగీకరించిన తర్వాతకూడా యింకా భారతప్రభుత్వం జాప్యం చెయ్యడం దేనికి? ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి తక్షణమే ఉపక్రమించ వచ్చునుగదా?

పండిట్ నెహ్రూ:—అన్నిటికంటే మద్రాసునగరాన్ని గురించిన సంగతే ముఖ్యమైందనే మాటా, ఆ మరకులకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అంగీకరించిందనేమాటా రెండూ కూడా నిజమే. కాని దీన్ని గురించి వెంటనే మరి అనేక అనుమానాలు సంకోచాలు ఉత్పన్నమైనాయనే విషయం అందరూ ఎరిగిందే. ఈ అనుమానాలు ప్రశ్నలూ అన్నీ నివృత్తికావాలని భారతప్రభుత్వం కోరుతున్నది. ఆంధ్రరాష్ట్రం సత్వరమే ఏర్పడాలంటే ఈ అనుమానాలు అన్నిటిని నివృత్తిచేయడానికి త్వరత్వరగా కృషి జరగాలి."

రంగాగారు:-ఆంధ్ర, తమిళ, కర్నాటక, కాంగ్రెసు కమిటీల అధ్యక్షులు మిమ్మల్ని కలుసుకొని, మద్రాసు నగరం మినహా తక్కిన ఆంధ్రప్రాంతాన్ని యావత్తూ ప్రత్యేక ఆంధ్రరాష్ట్రంగా ఏర్పాటు చేయడానికి అంగీకారం సూచించినమాట వాస్తవమేనా?

ప్రధానమంత్రి: అప్పుడు ఈముగ్గురు నాదగ్గరకువచ్చి, ఆ సంగతిఏదో అస్పష్టంగానోటిమాటగా నాతో అన్నారు. కాని ప్రభుత్వం ఇటువంటి విషయాలలో అస్పష్టమైనప్రకటనలను ఆధారం చేసుకొని కార్యాచరణకు పూనుకోజాలదు. అదీగాక వీరుచేసిన ప్రకటనలను అప్పుడే మరికొందరు సవాలు చేయడంగూడా జరిగింది.

రంగాగారు: స్వామీ సీతారాంగారు ఉపవాసం ప్రారంభించి ఇప్పటికి అప్పుడే 28 రోజులు అయింది. మూడు కాంగ్రెసు కమిటీల అధ్యక్షులూ చేసిన ప్రకటనలతో సంబంధించి ప్రధానమంత్రి వెంటనే కార్యాచరణకు పూనుకోరాదా? ఇంతటి ముఖ్యమైన విషయంలో ప్రభుత్వం ఇంతి జాప్యంచెయ్యడం ఏమి సమంజసంగావుంది."

ప్రధానమంత్రి: ప్రభుత్వంజాప్యం చేస్తున్న దనడంలో నాకేమీ అర్థం కన్పించడంలేదు. నిజానికి ప్రభుత్వం ఈ విషయంలో ఇప్పుడుగాదు 18 రోజుల క్రిందటే కార్యాచరణకు పూనుకొన్నది. 48 గంటల్లో అయిపోవలసిన పనికి, వారే ఈ కాలహరణం అంతా చేస్తున్నారు. ఎవరో కొందరు పూజ్యులైన వ్యక్తులు నిరశన వ్రతానికి ఉపక్రమించారని చెప్పి, పరిపాలనా వ్యవస్థ యావత్తూ స్తంభించి పోవాలంటేమాత్రం నేను అంగీకరించజాలను."

## ఆంధ్ర కాంగ్రెస్ తీర్మానం

(1 వ పేజీ తరువాయి)

త్వము ఒప్పుకొని సంతకించిన నివేదికలను ఆధారం చేసుకొని రాష్ట్ర నిర్మాణానికి పూనుకొంటామనిన్నీ; రాష్ట్ర సాధనలాంటి రాజ్యాంగ సంబంధమైన విషయాలను సాధించుటకు ఉపవాసం, దీక్ష, సత్యాగ్రహమార్గము గాదనిన్నీ అఖిలభారత అధినేత పండితనెహ్రూ అభిప్రాయములో యీ సభవారు ఏకీభవిస్తున్నారు."

"రాష్ట్రనిర్మాణం విషయంలో నెహ్రూ కనబరచిన సద్భావమునకు యీ సభవారు హృదయపూర్వక కృతజ్ఞత వెల్లడించుచున్నారు."

"ప్రధానినెహ్రూ సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు సుముఖంగా ఉన్నట్లు స్పష్టపరచినమీదట, ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు చట్టబద్ధమైన ఆందోళన సాగించవలెనుగాని, కాంగ్రెసువారులు సత్యాగ్రహము మొదలగు మార్గములలో పాల్గొనుటగాని, సహాకరించుటగాని చేయరాదని యీ సంఘమువారు హెచ్చరించుచున్నారు."

ఈ తీర్మానముపై చర్చ సందర్భములో, ముగ్గురు, నలుగురు రాయలసీమ సభ్యులు తీర్మానమును ప్రతిఘటిస్తూ మాట్లాడినట్లు తెలియవచ్చింది. రాష్ట్రం రాకపోతే కాంగ్రెసుకు ఓట్లురావని సర్కార్ల ఆంధ్రులెలా అభిప్రాయపడుతున్నారో, అలాగే, మద్రాసు లేకుండా, ఆంధ్రరాష్ట్రం నిర్మింపబడితే, కాంగ్రెసుకు ఓట్లురావని రాయలసీమ ప్రజలు అభిప్రాయపడుతున్నారని వారు వాదించారట.

ఈ తీర్మానం, యీ సాయంకాలం జరిగే సర్వసభ్యసమావేశ ఆమోదానికి ప్రతిపాదింపబడుతుంది. అల్లూరి సత్యనారాయణరాజుగారే ప్రతిపాదించవచ్చు.

నెహ్రూ నాయకత్వంలో సంపూర్ణ విశ్వాసాన్ని ప్రకటిస్తూనూ, రాజీనామా యిచ్చుటలో సముచితంగా, సహాయకారిగా ప్రవర్తించినందుకు టాండన్‌ను ప్రశంసిస్తూనూ, కార్యవర్గం మరో తీర్మానం చేసింది.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras.

## మదరాసు రేవు ఎగుమతి దిగుమతులు

### 1950-51 లో వ్యాపార అభివృద్ధి

మదరాసు, సెప్టెంబరు 12: మదరాసు రేవులో 1950-51 సంవత్సరమున ఎగుమతి దిగుమతుల వ్యాపారం యిదివరకంటే విశేషంగా పెరిగిందని పై సంవత్సరం పరిపాలనా నివేదిక తెలుపుతూంది. మదరాసు రాష్ట్రం వ్యాపారంలో 47% ఈ రేవుగుండా జరిగింది-ఆహార ధాన్యముల దిగుమతులు గాక యితర వస్తువుల దిగుమతులు ఈ రీతిగా నుండెను.

దిగుమతులు 1950-51 రు. 7264.88 లక్షలు 1949-50 రు. 7837.30 లక్షలు తగ్గుదల రు. 572.42 లక్షలు.

ఎగుమతులు:-1950-51 రు 7307.27 లక్షలు, 1949-50 రు. 5765.63 లక్షలు పెరుగుదల రు. 1541.64 లక్షలు.

విదేశీయ వ్యాపారం (ఎగుమతులు దిగుమతులు) 1950-51 రు. 11583.25 లక్షలు, 1949-50 రు. 11138.48 లక్షలు. పెరుగుదల రూ. 444.77 లక్షలు.

కోస్తా వ్యాపారం:- (ఎగుమతులు దిగుమతులు) 1950-51 రూ 2988.90 లక్షలు, 1949-50 రూ 2464.45 లక్షలు, పెరుగుదల రూ 524.45 969.22 లక్షలు.

మొత్తం వ్యాపారం:- 1950-51 రు 14572.15 లక్షలు 1949-50 రూ. 13602.93 లక్షలు పెరుగుదల రూ 969.22 లక్షలు.

ఈ రేవులో దిగిన ప్రయాణీకులయు యిక్కడ నుండి వెళ్లిన ప్రయాణీకులయు సంఖ్య తగ్గింది. 1949-50 లో 23941 మంది ప్రయాణీకులు రేవునుండి వెళ్లారు. 41829 మంది వచ్చారు. మొత్తం 65770. 1950-51 లో ఇక్కడ నుండి వెళ్ళిన ప్రయాణీకుల సంఖ్య 30804 దిగినవారిసంఖ్య 27117 మొత్తం 57921. ఈ సంవత్సరంలో మొత్తం మీద 1048 నావలు రేవుకువచ్చాయి. గత సంవత్సరంలో 1014 నావలువచ్చి యుండెను. అయితే యీ స్టీమర్లు మోసిన సరుకుల బరువు మొత్తం 3768344 నుండి 3734841 టన్నులకు కొద్దిగా తగ్గింది.

చాలా సంవత్సరాల తరువాత మొదటి జపాను నావ "ఎంకీమారు" అనునది 1951 ఫిబ్రవరి 28 వ తేదీని మదరాసు రేవుకు వచ్చింది.

## నాట్యకళాసాహిత్య పరిషత్తు

మదరాసు, సెప్టెంబరు 12: శ్రీ నాట్యకళాసాహిత్య పరిషత్తు గౌరవ సలహాసంఘ సభ్యులుగా ఎన్నుకోబడ్డ గౌ॥ బెజవాడ గోపాలరెడ్డి గారిని ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు డైస్ ఛాన్సలరు పదవితో సత్కరించినందులకు వారి సన్మాన గౌరవార్థం వారిచే రచింపబడిన 3 నాటికలలో గాంధారీ ఆవేదన, కుంతీకర్ణ సంవాదము, సహగమనము అను మూడు నాటికలను వారి అధ్యక్షత క్రింద పైపరిషత్ సదస్యులచే ప్రదర్శింప చేయుటానికి నేటి సాయంత్రం పరిషత్ కేంద్ర కార్యాలయమునందు జరిగిన సమావేశమున తీర్మానింపబడింది.

## మద్రాసు రాష్ట్ర పంచాయితీలమహాసభ

మద్రాసు, సెప్టెంబరు 12: రాష్ట్ర పంచాయితీబోర్డుల యూనియన్ కార్యదర్శి నరసింహాదేవర సత్యనారాయణ గారిలా తెలుపుతున్నారు:

మదరాసు రాష్ట్ర పంచాయతీల మహాసభ సెప్టెంబరు 28, 29, తేదీలలో మదరాసు పట్టణమున "రాజాజీ" హాలులో టి. యస్. రామలింగం చెట్టి గారి ఆధిపత్యమున జరుగనున్నది. రాష్ట్ర ముఖ్యమంత్రి పి. యస్. కుమారస్వామి రాజా గారు ప్రారంభోపన్యాసం యిస్తారు. మహాసభ 28 న 2 గంటలకు సమావేశం మౌతుంది. ఉ॥ 9 గంటలకు "రాజాజీ" హాలులో విషయ నిర్ణయసభ తిరిగి 29 న ఉ॥ 8 గంటలు మొదలు 11 గంటల వరకు మహాసభ.

విద్యున్నుతో దొరుకుట దుర్లభ మయినందున ప్రతినిధులకు ప్రత్యేకముగా భోజనాదివసతులు యేర్పాటు చేయుటలేదు. బసలకు స్థలములు, భోజనములకు హోటల్సు యేర్పాటు చేయుచున్నాము. కంటనే పంచాయితీ ప్రతినిధులు తమరాక ముందుగా తెలియజేసిన భోజనాది వసతులు యేర్పాటు చేయబడగలవు. పంచాయితీలు ప్రతినిధిరుసుము రు. 5-0-0 కార్యాలయమునకు పంపితే సభలో హాల్లో ను టకు ఫీలు గా టెలిగేటు టిక్కెట్లు జారీ చేయబడగలవు. గ్రామ పంచాయితీలు వెంటనే ప్రతినిధులను పేర్కొని ప్రతినిధిరుసుములతో తీర్మానములను కార్యాలయమునకు పంపించవలెను.

## ముఖ్యమంత్రివద్దకు ఎన్. జి. ఓల రాయబారం

మదరాసు, సెప్టెంబరు 12: మదరాసు యన్. జి. ఓల సంఘ రాయబారం ముఖ్యమంత్రి శ్రీ పి. యస్. కుమారస్వామి రాజా గారిని కలుసుకొని కేంద్ర ప్రభుత్వోద్యోగులకు యిస్తున్న రేటుప్రకారం తమకు కరువుభత్యం హెచ్చుచేసి అలవెన్సు మంజూరు చేయవలసిందనివిజ్ఞప్తి చేసుకొన్నారు. ఈ సమయంలో ఆర్థికమంత్రి శ్రీ బి. గోపాలరెడ్డిగారు కూడా హాజరై యుండిరి.

## కాందిశీక పునరావాస సమస్య

### రాష్ట్ర ప్రభుత్వాలకు కేంద్ర ధనసహాయం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 12: కాందిశీకుల పునరావాస కార్యాల విషయంలో రాష్ట్ర ప్రభుత్వాల అవసరాలను తీర్చేందుకు కేంద్రప్రభుత్వం 400 లక్షల రూపాయలు మంజూరు చేయనున్నట్లు తెలుస్తున్నది. ఈ మొత్తాన్ని ప్రభుత్వం కేంద్ర పునరావాస శాఖను జారీన మంజూరు చేస్తుంది.

ఈ 400 లక్షలలోను 130 లక్షల రూపాయలు తూర్పు బెంగాలు కాందిశీకులకు పునరావాస కార్యాలు కల్పించేనిమిత్తం ఖర్చు పెట్ట బడుతుందని భావింపబడుతున్నది.

## క్రీడారంగం

### ఇంటర్ రైల్వే ఫుట్‌బాల్

ఖరగ్‌పూర్, సెప్టెంబరు 13: ఇంటర్ రైల్వే ఫుట్‌బాల్ టూర్నమెంటునందు నేటి సాయంకాలం, అస్సాం రైల్వేజట్టు, బికనీర్ స్టేటు రైల్వేజట్టును 3-1 గోలులతో ఓడించారు. గెలుపొందిన జట్టు 16 వ తేదీన బెంగాల్ నాగపూర్ రైల్వేజట్టుతో ఆడుతుంది. వేరొక ఆటయందు బి. బి. సి. ఐ. రైల్వేజట్టు, నిజాంస్టేటు రైల్వేజట్టును 1-0 గోలులతో ఓడించారు. నిజాం రైల్వే జట్టు ఆటలో మంచి నైపుణ్యం ప్రదర్శించినప్పటికీ, నేర్పరితనంతో గోలు చేయగలవారు లేకపోవుటచే ఓడిపోయారు. గెలుపొందిన జట్టునకు, సదరన్ రైల్వే జట్టునకు 16 న ఆట జరుగుతుంది.

### నడకపందెములో సోవియట్ యువకుని రికార్డు

లండన్, సెప్టెంబరు 13: బ్రూనో యుంక్ అనే 22 సంll ల సోవియట్ యువకుడు నడకపందెములో 15000 మీటర్లను 1 గం. 8 ని. 8 సె. లలో నడచి కొత్త రికార్డు ఏర్పాటుచేశాడు. ఇంతవరకు యీ దూరమునకున్న ప్రపంచ రికార్డు 1 గం. 8 ని. 28 సె. లు.

## రేడియో

### సెప్టెంబరు 16 ఆదివారం

**విజయవాడ**

ఉ॥ 7 తెలుగున వా॥ 7.15 మద్రాసు (బి) వలె 7-30 మద్రాసు (ఎ) వలె ఆంగ్లమున వా॥ మ॥ 1 మద్రాసు వలె 1-30 మద్రాసు (ఎ) వలె 1-40 హిందీలో వా॥ 4 బొమ్మరిల్లు నిర్వహణ ఏదిద కామేశ్వరరావు యుక్తికత కథానిక అక్కన్న మాదన్న నాటిక పేద బావగారు పాట తపాలబంది చిఱుకపలుకులు సెలవు.

సా॥ 5-30 కాకి రామకృష్ణారావు 5-50 వై. జాదయ్య క్లారినెట్ 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-20 గీతమంజరి (రి) టి. సూర్యకుమారి 6-30 గ్రామస్థుల కార్యక్రమం 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 కాకి రామకృష్ణారావు 7-45 కీలా శాసనమునకు వలదిండి ఛానమ ప్రసంగం దానధాణ వెంకటకృష్ణారావు 8 నోరి నాగభూషణం వసులిగా కొన్నలగడ్డ సింహాద్రిశాస్త్రి మృదంగం 9 ఆంగ్లమున వా॥ 9.15 శ్రోతలు కోరిన రికార్డులు 9-30 ముగింపు.

**మద్రాసు (ఎ)**

ఉ॥ 7 స్వాగతము 7-30 ఉదయగానము (రి) 8 ఆంగ్లమున వా॥

మ॥ 1 తంజావూర్ పి. కృష్ణమూర్తి పిళ్లె ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రాతో 1-30 గీతమంజరి (రి) గానసరస్వతి రాజరత్నం అమీర్ బాయి కర్నాటకి 1-40 హిందీలో వా॥ 1-50 ఫిలిం సంగీతం (రి) తిరుచి లోకనాథన్ వి. నాగయ్య సూరజ్ 2-10 గానమంజరి (రి) వాణీసరస్వతి టి. సూర్యకుమారి విజయాదేశాయ్ జయదేవి వైజయంతిమాల కె. ఎస్. లక్ష్మి 2-30 రెండు తమిళ గీతాగుచ్ఛము తిరుచిమండి 3 టి. కె. రాధాకృష్ణన్ వేణువు 4 మలయాళమున నాటిక 4-15 కన్నడమున నాటిక 4-30 పాశ్చాత్య సంగీతం (రి).

సా॥ 5-30 ఎస్. కళ్యాణరామన్ 6 ఆంగ్లమున వా॥ 6.10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-15 కె. వసంతకృష్ణన్ 6-45 కె. పళనిస్వామి ఓడువర్ 7-30 గీతమంజరి (రి) మదిపేళుల్లై, విజయకుమారి, అనోళిఆదా, షాన్ 7-45 (బి) వలె 9 ఆంగ్లమున వా॥ 9-15 మల్లి సూర్యనారాయణమూర్తి 9-45 పాశ్చాత్య సంగీతం (రి) 10.30 ముగింపు.

**మద్రాసు (బి)**

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 ఉదయగానము (రి) సెమ్మంగుడి శ్రీనివాసయ్యర్ ముసిరి సుబ్రహ్మణ్యయ్యర్ 7-30 పిల్లల కార్యక్రమం తమిళమున 8 (ఎ) వలె.

మ॥ 1 (ఎ) వలె 1-30 ఆంగ్లమున వా॥ 1.40 ఫిలిం సంగీతం (రి) పి లీల ఎం ఎస్. సరోజిని సురైయా 1-50 తెలుగున వా॥ 2 వీణ నిలయవిద్వాంసుడు 2-15 బందరుపు నిర్వహణ స్వాతి రాఘవరావు 3 (ఎ) వలె 4 కదంబం (రి) వరది భాగీరథి టి. జి. సరస్వతి ఎ. కమలాదేవి వరలక్ష్మిపార్టీ.

సా॥ 5-30 (ఎ) వలె 6-15 సాయం సంగీతం (రి) ఎస్. రేకవేణువు కె. సుబ్రహ్మణ్యం వీణ 6.30 గ్రామస్థుల కార్యక్రమం 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 (ఎ) వలె 7-45 టి. ఎస్. విజయలక్ష్మి 8 30 పెల్లూరు ఆర్. కె. శ్రీరాములు వయొలిన్ 9 (ఎ) వలె 9 45 శ్రోతలు కోరిన రికార్డులు 10-30 ముగింపు.

**హైదరాబాద్**

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 తెలుగు హిందీ ఉర్దూ నేటి కార్యక్రమ వివరణ 7-20 రామనవెంకటలక్ష్మమ్మ 7-50 సంగీతమంజరి (రి) 8 ఆంగ్లమున వా॥ 8.15 గీతావళి (రి) 8-30 అనంతమనోహర్ జోషి 9-15 బాలవినోదం వారవరములోని నాటకము నాటిక రచన కె. ఎ. జి. కృష్ణన్ గొల్లభామ (రి) బొమ్మలపెళ్ళి బృందగానము రాగంగోష్ఠి.

మ॥ 12-30 రంగరంగ (రి) 1 హిందీలో పిల్లల కార్యక్రమం 1-30 ఆంగ్లమున వా॥ 1.40 దసరవంగిజే (రి) 1-50 తెలుగున వా॥.

సా॥ 5-30 మహారాష్ట్రమున కార్యక్రమం 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు 6.20 గీతావళి ఏవర్‌రావు 6-35 శ్రోతల కోరిక 6 45 గ్రామసీమ మాటామంతీ కె. ఎల్. నరసింహారావు 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ గ్రామవహమూలము వైద్య ప్రసంగం గీతావళి విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 8-15 వాగ్గేయకారకుల తిపిరము ఓపిరన్ ప్రసంగం పి. వి. సుబ్రహ్మణ్యం 8-30 అనంత మనోహర్ జోషి 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీలో వా॥ 9-30 రామస్వామి వెంకటలక్ష్మమ్మ 10-15 ముగింపు.

## మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 14.

బంగారు-వెండి నేటిమధ్యాహ్నం 1 గంటవరకు 1-3 ఎడ్వర్డు బొమ్మ సేట్లుటాక్సుతోసహా రు 77.0.0 పెల్లాబంగారు తులం 110.14.0 మూన బంగారు 108 8.0 పీసువెండి తులం 100-5 (రెడీ) 187.0.0 వెండి తులం 1-8 1.15.0

వేరుశెనగ: (531 పా 1-3 ఎక్స్‌పోర్టు గిడ్డంగుల డెలివరీ సేల్సుటాక్సుతో సహా) వరాని రు. 177.0.0

వేరుశనగనూనె ఎడ్యుసెంట్ లిలో 3% నామినల్ (500 పా.) రు. 350, 351

బంగాయ మూనె (37½ పౌనులు గం డబ్బా)

ఒకటి-
క్యలాజ్ రు 39.12.9
కారికట్ యస్. బ్రాండ్ 39.14.9

## కావలెను

శ్రీకాకుళం దరిపొన్నాడ ఎ. యం. స్కూలులో జీతము రు 30+19 డి. ఎ. మీద హాయ్యరు గ్రేడు టీచరుగ పనిచేయుటకు 30-9-51 తేదిలోగా S.L. Moorty, Manager, Ponnada. (via) Srikakulam పంపవలెను.

## కావలెను

వేరువేరు కొనలకు రు 150/-ల మీద సేల్సు ఇన్‌స్పెక్టర్లు కావలెను. రు 125/-లు పెట్టుబడి పెయ్యవలెను. కలకత్తాలో ఇంటర్వ్యూ. వివరములకు Service & Supply (India) Ltd, 25 and 26, Waterloo Street, Calcutta. 1.

## ప్రకటన

4 హెచ్.పి. కొన్‌కో, 6 హెచ్.పి. ఈస్టు జపాన్, 8 & 10 హెచ్.పి. యన్మార్ అన్ని జపాన్ ఇంజనులు ఓడమీద నుండి బహుత్వరలో చేరనున్న కన్‌సైన్‌మెంట్లనుండి లభించగలవు. వివరములకు: బాక్సు నం. 5/1671, C/o ఆంధ్ర పత్రిక, మద్రాసు-1.

## నెలకు రు 200/- సంపాదించండి.

మీరు (1) ప్రాక్టికల్ ఎలక్ట్రిషియన్‌గ గాని (2) ఆర్మేచర్ వైండర్‌గ గాని (3) శానిటరీ అండ్ పైప్ ప్లంబర్‌గ గాని 3 నెలలలో శిక్షణ పొందండి. ప్రాస్పెక్టసుకు వ్రాయండి, Hindustan College of Technology, No, 1A, Edward Elliot's Road, Madras Phone 86870.

## బహిరంగ వేలము

### 23—9—1951

తిరుమల - తిరుపతి దేవస్థానములు వేలూరు మ్యునిసిపాలిటీ పరిహద్దులలో ఉన్న దిగువ తెల్పిన ఆస్తులను 1951 సెప్టెంబరు 23-వ తేదీ ఉ. 9 గంటలకు యస్. యం. డి. హెచ్. హైస్కూలు ఆవరణలో బహిరంగ వేలమున అమ్మెదరు.

1. వార్డు III టి. యస్. నం. 1674, మ్యునిసిపల్ డోర్ నం. 48 కలిగి కమిషరీ బజారు వీధిలో హై ఎలిమెంటరీ స్కూలు పెట్టబడి ఉన్న బిల్డింగు వైశాల్యము 8575 చ. అడుగులు. ఒక అంతస్తుది.
2. వార్డు III టి. యస్. 97 మ్యునిసిపల్ డోర్ నం. 2, కమిషరీ బజారు కడై వీధిలో ఉన్న దుకాణం వైశాల్యము 72 చ. అడుగులు. పెంకుటి దుకాణం.
3. వార్డు III టి. యస్. 98 మ్యునిసిపల్ డోర్ నం. 1, రెండవ నంబరులో తెల్పబడిన దుకాణము వెనుక స్థలము. వైశాల్యము 1632.చ.అడుగులు. బయలుప్రదేశము మాత్రమే.
4. వార్డు III టి.యస్. 1671, ప్రహరీ గోడ, పాకి దొడ్డి కలిగిన బయలు ఆట స్థలము ఆవరణ 4962 చ. అడుగులు.

అమ్మకపు షరతులు నిబంధనలు వెల్లూరులో యస్. యం. డి. హెచ్. హైస్కూలు ఆఫీసువద్ద ఏ పనిదినమునైనను లభించును.

(సం) సి. అన్నారావు,
కమిషనరు,
తి. తి. దేవస్థానములు, తిరుపతి.